## నోటీసు

తెనాలి అసిస్టెంటు స్పెషల్ కోర్టులో

O. S. 22/39 E. A. 203/45.
E. A. 142/45
E. A. 141/45 E. A. 278/45.

మోపదేవి హనుమంతరావు T. D. H. R.
J.Drs: 6 [illegible], 7 [illegible], 8 [illegible]
Original D. H. R.

శేట్ లాల్ చందు కుశాల్ చందు

కోర్టువారు వినా CPC Or. 21 R 16& 22, ప్రకారంయున్నా, వారికి నోటీసు నిమిత్తమున్నా, Guardian discharge నోటీసుకున్నా 4-9-45కి వాయిదా వేసినారు.

అప్పారాజు రామసుబ్బారావు,
T. D. H. R's Vakil.



# ఆంధ్రులకు హెచ్చరిక

ఆంధ్రపత్రిక ఆగస్టు 12 సంచికలో 'బళ్ళారి కర్ణాటకులది' అనే ఉషపత్రిక సంపాదకుడు బసవరాజు కట్టిమనిగారి వ్యాసం ప్రకటించాము. దానిపైన అనంతపురం నుంచి మాకు ము. సోమశేఖర్ గారు వ్రాసిన లేఖ నిక్కడ ప్రచురిస్తున్నాము:

బసవరాజు కట్టిమనిగారు వ్రాసిన 'బళ్ళారి కర్ణాటకులదే' అనువ్యాసము యొక్క తెలుగు అనువాదము చూస్తేనాకు చాల ఆశ్చర్యము, దుఃఖము వేసింది. జనాభాలో తెలుగువాళ్ళు ఎక్కువగానున్న బళ్ళారి, పైగా కేంద్ర్ నిర్ణయము ప్రకారము ఆంధ్ర కర్ణాటకుల కిరువురికి ముఖ్య పట్టణముగా నిర్ణయింపబడిన బళ్ళారి, కర్ణాటకులదే అనుట ఎంతసమంజసముగా నున్నది? పాపము సంపాదకునకు బళ్ళారిలో తెలుగు ప్రాంతీబళ్ళలుండుట కంటకముగా నున్నది. కాబోలు. "బళ్ళారిమాది కర్ణాటకులది. మాతో తెలుగువాళ్ళు సఖ్యముగా ఉండదలచుకుంటే ఉండవచ్చును. లేకపోతే మూటముల్లె కట్టుకొని సంటురుకో బెజవాడకో లేకపోతే తిరుపతికో యాత్రకైనా వచ్చును" అన్నాడా సంపాదకుడు. ఆంధ్రులకు గతిలేక బళ్ళారిలో నివసించుచున్నట్లు పైగా 'బళ్ళారిపట్టణాన్ని విడిచి తోలగండి' అనే ఉద్యమాన్ని లేవదీస్తున్నా డీకట్టిమనిగారు. గడుగులో కన్నడ విద్యార్థులు మహారాష్ట్ర డాక్టరును బహిష్కరించినట్లు బళ్ళారి కన్నడ విద్యార్థులు తెలుగువారిపై నేల చేయరాదని ప్రశ్నించుతాడు. బళ్ళారిలోని తెలుగువాళ్ళు కన్నడులకేనాడైన ఎట్టి అపచారము నొనరించినట్లు మనము కని విని ఎరుగము. అట్టి సమయములో ఆంధ్రులు చెంపలు వేయించుకొనునంత అగత్యమేమి? సఖ్యత్వాన్ని విడిచిందెవరు? ఆంధ్రమహాసభను బహిష్కరించి, ఆంధ్రభాషను బళ్ళారిలో రుద్దుకొట్టించవలయునని అలజడి చేయుచున్నది. కన్నడులు కాదా? ప్రతాపగిరి వెంకటసుబ్బారావు, తిమ్మప్ప శ్రేష్ఠిగారు ఉన్నంతకాలము బళ్ళారి ఆంధ్రులకు ఆంధ్రోద్యమానికి ఏలోటు రానీయరు.

అది అటులుంచి మదరాసులో తమిళుల ఒత్తిడి ఆంధ్రుల కెక్కువైనది. కడకు మేయర్ రాధాకృష్ణపిళ్ళేగారు మదరాసు తమిళులదే, మాటకువస్తే తిరుపతి కూడ మాదే అంటూ ప్రకటించాడు. కడకు, నశించిపోవుచున్న ఆంధ్రోద్యమానికి జీవాన్ని పోరవోసిన సర్ విజయగారిని మదరాసు కార్పొరేషన్ వారు సన్మానించకూడదని ఎందరో తమిళసభ్యులు అలజడి చేసినారు. తెలుగువ త్యాగరాయ కృతులు పాడుటకూడ తమ తమిళభాష కవమానకరమని కాబోలు అణ్ణామలై శెట్టియార్ గారు తమిళ ఇసై సంఘము స్థాపించి తమిళులు అందరు తమిళసంగీతమునే ప్రోత్సహించవలయునని చాటుచున్నారు.

ఇక మరో ఉత్తరాన ఓఢ్రులలో మన ఆంధ్రులు పడుచున్న అగచాట్లు చెప్ప నక్కరలేదు. బరంపురములో ఆంధ్రుడు పబ్లిక్ ప్రాసిక్యూటరయినాడని ఓఢ్రులు చేసిన అలజడి ఇంతంతగాదు. మదరాసు రాష్ట్రమునకు చేరిన 'పర్లాకిమిడి' మాదే అంటూ కొత్తఉద్యమాన్ని లేవదీశారీ ఓఢ్రులు. ఎన్నో సంవత్సరాలు కష్టపడి స్థాపన చేసి ఎంతో ధనవ్యయము చేసిన తర్వాత మనకు రాబోవు విశ్వవిద్యాలయమును రానీయకుండ అడ్డుపడ దలచుకొన్నారు. ఓఢ్రులలో విద్యార్థులు మొదలుకొని పెద్దలవరకు ఆంధ్రులపై కత్తిగట్టి పూనుకొన్నారు.

హైద్రాబాదు సంస్థానములో నాల్గింట మూడుపాళ్ళు జనాభా కలిగిన తెలుగువాళ్ళు ఉర్దూ సంపర్కముచే, మైసూరులో కోలార్ ప్రాంతాలలోని ఆంధ్రులు కన్నడ భాషా సంపర్కముచే, తమ భాషను ఆంధ్రత్వమును పూర్తిగా పోగొట్టుకొనుచున్నారు.

మనలో ఆంధ్రోద్యమ మున్నదని మరువకండి. స్వభాషాభిమానాన్ని ఏనాటికి వదలకండి. పత్రికలలో ప్రకటించినట్లు, విజయాగారు ఇంగ్లాండు వెళ్ళి ఆంధ్ర రాష్ట్ర విషయమై అందులో ముఖ్యముగా మదరాసు, దుడుమా, బళ్ళారుల విషయమై బ్రిటిష్ ప్రభుత్వముతో చర్చించి వచ్చుట శ్రేయస్కరము. స్వజాతి, స్వభాషా గౌరవాన్ని నిలబెట్టడానికి ఆంధ్రులు కృషి చేయాలి. కన్నడులకు, తమిళులకు, ఓఢ్రులకు ఏనాటికి కార్యసాధనయందు ఆంధ్రులేమీ మాత్రము తీసిపోరని నిరూపించవలయును.

## నెహ్రూ లక్నో ప్రయాణం

లక్నో, సెప్టెంబరు 1: పండిట్ జవహర్లాల్ నెహ్రూ "నేషనల్ హెరాల్డ్" పత్రిక డైరెక్టర్ల సమావేశంలో పాల్గొనడానికి ఈ నెల 9 వ తేదీన లక్నో వస్తారు.

# గండికోట ప్రాజెక్టు

(శ్రీ వెల్లాల రామకృష్ణ శాస్త్రి బి. ఏ.,)

ఈ గండికోట ప్రాజక్టును సంబంధించిన ప్లానులు, ఎస్టిమేట్లు ప్రత్యేక ఇంజనీరింగ శాఖవారు పూర్తిగావించియున్నారు. ఇందులో ముఖ్యులు ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరు గారైన శ్రీ ఇ. వి. నారాయణ అయ్యర్ గారు. కడప జిల్లాలో జమ్మలమడుగుకు 11 మైళ్ల దూరములోను, కొండాపురము రైల్వేస్టేషన్ కు 5 మైళ్ల దూరములోను ఉండు చరిత్ర ప్రసిద్ధమైన గండికోట దగ్గర, ఉత్తర పెన్నానది రెండు కొండలమధ్యలో ప్రవేశించు స్థలమునకు 1 మైలు దూరమున, ఒక ఆనకట్ట కట్టుటకు తీర్మానించియున్నారు. ఈ ప్రదేశములో 150000 లక్షల ఘన అడుగుల నీరు అనికట్ట బడును. ఆ నీరు సుమారు 33 చదరపుమైళ్ల భూమిని ఆక్రమించును. ఇచ్చట నిలువచేయబడిన నీటిని కాలువలనుండా జమ్మలమడుగుకు 4 మైళ్ల దూరమునఉన్న మైలవరము గ్రామము వద్దకు రానిచ్చి, అచ్చట మరియొక రిజర్వాయరుకట్టి నీటిని నిలువుదల చేయగలరు. ఈ మైలవరము రిజర్వాయరునుండి (1) కడప ఉత్తరపు కెనాల్ అనియు (2) కడప దక్షిణ కెనాలనియు రెండు కాలువలద్వారా కడపజిల్లాలో జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, కామలాపురము తాలూకాలలోని భూములకున్నూ; కర్నూలుజిల్లా కోవెలకుంట్ల; సిరివెళ్ల తాలూకాలలో కొంతభాగములకున్నూ విడుదల చేయబడును. అనేకమైన చిన్న చిన్న తూములు, 17 పెద్ద తూములు ఈ ప్రాజక్టుక్రింద ఏర్పాటు చేయబడును. పొలములమధ్య నీరునిలిచి, బురదగుంటలు ఎక్కువ కాకుండా భూములలో పారిన నీటిని, తొలగించుటకు కూడ ఏర్పాటు చేయబడినది. 15,179 ఎకరములు ముంగారు పైరుకు, 39,337 ఎకరములు హింగారి మిట్ట భూములకు 10,325 ఎకరములు, తరీ భూములకు మొత్తం 100,792 ఎకరములకు ఈ ప్రాజక్టు నీరు ఇవ్వబడును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. జమ్మలమడుగు తాలూకాలో | | 23,971 | ఎకరముల మిట్ట | 3642 | ఎకరముల తరి |
| 2. ప్రొద్దుటూరు | ,, | 29,000 | ,, | 3,000 | ,, |
| 3. కామలాపురము | ,, | 30,534 | ,, | 3686 | ,, |
| 4. కోవెలకుంట్ల | ,, | 3,195 | ,, | | |
| 5. శిరివెళ్ల | ,, | 3,690 | ,, | | |

ఈ ప్రాజక్టు క్రింద నిలువుదల చేయు నీరంతయు మొట్టమొదట కడప జిల్లాలో పారుదలకే ఉపయోగింప బడునని అసందిగ్ధభావములో స్పష్టముగా ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరు గారైన శ్రీ నారాయణ అయ్యరుగారు జిల్లా కలెక్టరుగారి అధ్యక్షత క్రింద ఆగస్టు 25 తేది జరిగిన సభలో తెలిపియున్నారు.

గత సంవత్సరము వర్షాకాలములో, పినాకినీ నదిలో గండికోట దగ్గర ఎంత నీరు పారినది లెక్కించి, పై అంచనా తయారుచేయబడినది. ఈమాదిరిగా ఈ సంవత్సరమును, రాబోవు సంవత్సరమున్నూ, నీటిని కొలిచి లెక్కించుటకు ఒక ప్రత్యేక సూపర్ వైజరును నియమించియున్నారు. ఈ సంవత్సరము, రాబోవు సంవత్సరము; నీటిని కొలిచి లెక్కించుటలో, ఇంకనూ ఎక్కువనీరు పెన్నానదిలో గండికోటవద్ద పారునని తేలినచో, ఇప్పుడు అంచనా వేయబడిన 15,000 ఘన అడుగుల నీటి రిజర్వాయరు కన్నను, 20,000 ఘన అడుగుల నీటి పరిమాణముగల రిజర్వాయరు కట్టబడును. ఆ రిజర్వాయరు అవసరమేర్పడుచో, నిర్మించుటకు ఇప్పుడే, ప్లానులు, ఎస్టిమేట్లు తయారు చేయబడియున్నవి. అటుల పెద్ద రిజర్వాయరు కట్టుటకు నీటిలెక్కలు అవసరము కనబడినచో, 2,52,000 ఎకరములు ఈ ప్రాజక్టుక్రింద సాగుబడి కాబడును. అంత విస్తీర్ణమునకు నీరు ఇవ్వబడును.

ప్రస్తుత ధరలప్రకారము రు 18,500,000 ఈ ప్రాజక్టును పూర్తిచేయుటకు పట్టునని అంచనా వేయబడినది. యుద్ధమునకు పూర్వముండిన రేట్లప్రకారము 8,800,000 మొదలు రు 9,000,000 అగునని అంచనా వేయబడినది. అయితే యుద్ధము పరిసమాప్తి నొందినందువల్ల, ధరలు క్రమక్రమముగా తగ్గవచ్చుననియు, ప్రాజక్టుపని ప్రారంభమగునప్పటికి స్పష్టముగా తగ్గుననియు, అందువల్ల — ఇప్పుడు అంచనా వేసిన మొత్తమునకన్న సరసముగనే ప్రాజక్టును నిర్మింపవచ్చునని ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరుగారు అభిప్రాయపడుచున్నారు.

ఈ ప్రాజక్టుక్రింద మొట్టమొదట కడపజిల్లా భూములకే నీరు ఇవ్వబడుననియు, అందులకు ఏలాంటి అనుమానముగానీ సందేహముగాని లేదనియు, స్పష్టమైన భాషలో జిల్లా కలెక్టరుగారైన శ్రీ యం. శేషాద్రి, ఐ. సి. యస్. గారు కడపజిల్లా ప్రజలకై ఒక బహిరంగ ప్రకటన ఈ ఆగస్టు 25 వ తేది గావించియున్నారు. ఇంతే మాత్రమే కాదు. ఈ గండికోట ప్రాజక్టు క్రిందఎంత ఎక్కువ భూమిని ఈ కడపజిల్లాలో సాగు చేయుటకు అవకాశముండునో, అంత ఎక్కువ భూమికి (గరిష్ఠ పరిమాణము వరకు) నీరు ఇచ్చుటకు తరిగా మార్చునట్లు చేసెదమనియు; ఈ ఆయకట్టు క్రింద సాగువల రేట్లను, ఎంత తక్కువగా నిర్ణయించి, రైతాంగమునకు ఎంతవరకు మేలు చేయుటకు వీలగునో అంత తక్కువగా న్యాయమైన రేట్లను (కనిష్ఠ సామాన్యపు రేటు) నిర్ణయించెదమనియు కడప జిల్లా కలెక్టరైన శ్రీ శేషాద్రిగారు వాగ్దానము గావించియున్నారు. ఇదియునుగాక, ఈ గండికోట ప్రాజక్టుక్రింద ఉండబోవు ఆయకట్టులో, నీటిరేట్లను నిర్ణయించుటకు ముందుగా తాను ప్రజాభిప్రాయమును బాగుగా తెలుసుకొని, దాని కనుగుణముగా నిర్ణయించెదనను మాట అసందిగ్ధ వచనములతో జిల్లాకలెక్టరుగారు తెలియచేసియున్నారు.

కాని ఈ గండికోట ప్రాజక్టుక్రింద — కడపజిల్లా అవసరములకు నీరు సరిపోయి, ఇంకా ఎక్కువగా మిగులుచో, ఇతర జిల్లాలలోని భూములకు (నెల్లూరుజిల్లాకు) ఇవ్వబడునేకాని, కడపజిల్లా అవసరములను ప్రతిఘటించి ఇతర జిల్లాలకు ఈప్రాజక్టు నుండి నీరు ఇవ్వబడునను వార్త, వదంతులయందు ఎంత మాత్రము సత్యము లేదని నేను జిల్లా కలెక్టరుగారి బహిరంగ ప్రకటన ననుసరించి జిల్లా ప్రజలకు విన్నవించుచున్నాను.

ఈ ప్రాజక్టు విషయమై తయారు కాబడిన ప్లానులు, ఎస్టిమేట్లు ప్రభుత్వమువారికి రాబోవు సెప్టెంబరు నెలలో పంపబడును. జిల్లా ప్రజలు ఈ ప్రాజక్టు విషయమై ఎంత తీవ్రముగా ఆందోళన చేయుదురో అంత త్వరలో ఈ ప్రాజక్టు ప్రారంభింపబడును. ఈప్రాజక్టును త్వరలో ప్రారంభింపచేయు భారము కడపజిల్లా ప్రజలందరిపై యున్నదని మరియొక తూరి విన్నవించుచున్నాను.

# అన్యరాష్ట్రాంధ్రులు - నివాసపత్రాలు

ఉత్కళ రాష్ట్రంలోనే ఆంధ్రులకును, తదితర ఉత్కళేతరులకును నివాసపత్రాలవసరమని ఆందోళన పడుతున్నాము. ఈ పద్ధతి బొంబాయిలో రాష్ట్రంలోనూ అమలు జరుగుతున్నదని శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తి నరసింహాచార్యులగారిట్లు బొంబాయినుంచి వ్రాస్తున్నారు.

నేటి అన్యరాష్ట్రాంధ్రులను గూర్చి మిత్రులు శ్రీ బి. సదానందమూర్తిగారు వ్రాసినలేఖ 5 వ ఆగస్టు ఆంధ్రపత్రికలో చదివితిని. ఒరిస్సాలో ఆంధ్రులకు డొమిసైల్ సర్టిఫికెట్టుద్వారా ఇక్కట్లు కల్పింపబడిన పనిరి. అట్టి ఇబ్బంది బొంబాయి రాజధానిలోని ఆంధ్రులకు అరవలకుగూడ సంప్రాప్తించినది. కాంగ్రెసు ప్రభుత్వములో ఎన్నడూ కనివిని ఎరుగని డొమిసైలు సర్టిఫికేటు పొందవలెను, ప్రభుత్వోద్యోగములు, చివరకు మెడికలు కాలేజీలలో గూడ సీట్లు లభింపవని శాసించిరి. డొమిసైలుసర్టిఫికేటు బొంబాయిలోని ముఖ్య ప్రెసిడెన్సీ మేజస్ట్రేటు నివారించి ఇయ్యవలసియుండును. నాకు తెలిసినంతవరకు అనేకమందికిని లభింపకపోవుటచే, ఉద్యోగములకేగాక, ఉన్నత చదువులకుగూడ వీలులేని పరిస్థితి కలిగినదని చెప్పవచ్చును. హిందువులు, మహమ్మదీయులు, శిక్కులు, బౌద్ధులు, జైనులు భారతదేశమంతటను, 'డొమిసైలు' కలిగియున్నారని న్యాయశాస్త్రము విధించుచుండగా వీరికి బొంబాయి యున్నగు ఇతర ప్రదేశములలో డొమిసైలు కల్పించుట చాలా అన్యాయమేగాక అశాస్త్రీయమని నా దృఢాభిప్రాయము.

దక్షిణాఫ్రికా భారతీయులకు నిబంధనలద్వారా జన్మహక్కుల నరికట్టినందుకు భారతీయులందరు వగచుచుండగా, మన దేశములో పరరాష్ట్ర ప్రభుత్వములే ఇట్టి అనవసరమును ప్రతిబంధక నిబంధనలు కల్పించుటలో అర్థమేమి?- ఇంతకు ప్రత్యేకరాష్ట్రము లేనందున, ఆంధ్రులకు ఇతరరాష్ట్రములలో గౌరవము సన్నగిల్లుచున్నదని దీనివల్ల తేలుచున్నది.

బొంబాయిలో ఆంధ్రులేగాక, అరవలుగూడ డొమిసైలు సర్టిఫికేటు అన్యాయమునకు గురియగుచున్నారు. శాస్త్రరీత్యా హిందువులకు డొమిసైలు లేకపోయినను, కల్పించి అపకారము చేయుచున్న ఆంధ్రేతర రాష్ట్రీయ ప్రభుత్వోద్యోగుల చర్య నేమనవచ్చును?

ఒరిస్సాలో ఈ సమస్య మరింత విషమముగా నున్నట్లున్నది. ఈ డొమిసైలు ప్రతిబంధకము ఆంధ్రజాతి తొలగించుటకు పూనుకొననిచో, అన్యరాష్ట్రాంధ్రులనేక ఇబ్బందులపాలగుదురని మనవిచేయుచున్నాను.

# స్వభాషలో విద్యాబోధ

డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ఆగస్టు 11 ఆంధ్రపత్రికలో 'మాతృభాషాసేవ' అను శీర్షికన వ్రాసిన వ్యాసమును పురస్కరించుకొని ముళ్ళపూడి వెంకటకృష్ణారావుగారు పెదకొండూరు నుంచి యిలా వ్రాస్తున్నారు:

పూజ్యులు పట్టాభి సీతారామయ్యగారి వ్యాసమునందలి భావముల నెవరును కాదనజాలరు. కాని విశ్వవిద్యాలయములందు మాతృభాషలో ఇప్పటివరకు ఎందుకు చదువులు చెప్పుట లేదనుదానికి, వారు మాతృభాషల్లో ఆయా విషయములందు సరియైన గ్రంథములు లేనట్లు యూనివర్సిటీలవారు చెప్పుచున్నట్లుగా వ్రాయుచున్నారు. ఆ చెప్పేది యూనివర్సిటీ అధికారులో, పండితులో మాత్రం వారు వివరంగా వ్రాయలేదు. కనుక ఈ విషయమై విశ్వవిద్యాలయములలోని పండితులేమంటున్నారో, వారిమాటల్లోనే యిట నుదహరింతును.

అలహాబాదు విశ్వవిద్యాలయమున హిందీ సాహిత్యశాఖా ప్రధానులు డా॥ ధీరేంద్ర వర్మ ఎం. ఏ. డి. లిట్ గారు ఈ విషయమై ఒకానొక సమయమున ఈ క్రింది రీతిగా ప్రస్తావించిరి.

"దేశములన్నిటిలో విశ్వవిద్యాలయములందలి ఉన్నత విద్యగూడ మాతృభాషయందే చెప్పవలెనను ప్రచారము అధికమగుచున్నది. దీనిని మేము గమనించుచున్నాము. ఆంగ్లమున-పరాయిభాషలో-అనర్గళముగా పాఠములు బోధింపగల పండితులు మాతృభాషలో బోధింపలేరని చెప్పుట హాస్యాస్పదము. కాని విద్యాలయముల అధికారులు మాతృభాషయందు చాలినన్ని గ్రంథములు లేవనుచున్నారు. ఇక రచయితలు "విశ్వవిద్యాలయములందు చదువు ఆంగ్లమున జరుగుచుండగా మేము పుస్తకములు వ్రాసి ఏమిచేయవలెను? అమ్మకము అవుతవను ధైర్యము లేనపుడు ఏ ప్రకాశకుడు వానిని ప్రచురింప సాహసించును?-అని యడుగుచున్నారు.

"యథార్థ మేమనగా భారతదేశమందలి విశ్వవిద్యాలయములు సర్కారువారి గుమాస్తాఖానాలు. రాజభాషను త్రోసి రాజని-జాతి కభివృద్ధిగలుగురీతిని-మాతృభాషలో విద్యను బోధించుటకవి ఇంకను సిద్ధముగాలేవు. ఇండియాలోని విశ్వవిద్యాలయములందు వందలకొలది ఉద్దండులైన పండితులు, ఆచార్యులు, డాక్టరేటులూ ఉన్నారు. డజన్ల కొలది రీసెర్చి స్కాలరులున్నారు. వీరందరు ఉన్నత తరగతుల విద్యార్థుల కుపయుక్తమగు రీతిగా మాతృభాషయందు గ్రంథములు వ్రాయలేరని చెప్పుట వారి నవమానించుట, వారిపాండిత్యమును శంకించుటయే యగును. వారేమరలమీద వ్రాయుదురు? వారొకేమరకు గోరుచున్నారు. కనీసము వారి రచనలు వ్రాతప్రతిలోనే చెదలున కాహారము గాకుండా ఎప్పటి కప్పుడు ప్రచురించగల ప్రకాశకులు గావలెనని గోరుచున్నారు. భారతదేశమున వేలకు వేలు లాభములు గడించుచున్న ప్రకాశకు లెందరో గలరు. గాని రచయితల రచనలు ప్రకటించుటకు వారొకే మొకమోవిమా గోరుచున్నారు. అది ఏమన వారు ప్రకటించిన గ్రంథములు బీరువాలలోనే అణగియుండక అచ్చుకర్చులకైనా వచ్చునట్ల మ్మక ముండవలెనని గోరుచున్నారు. విశ్వవిద్యాలయములందలి విద్యయంతేయు ఆంగ్లమున జరుగుచుండగా వారి గ్రంథము లమ్మకమగునని ఎవరు హామీ యివ్వగలరు? పాఠ్య గ్రంథములు సాధారణ గ్రంథములవలె అమ్మకమగునని-విశేషించి వానియవసరమే లేనపుడు ఎవరు నమ్మబలుకగలరు?

"పరిస్థితి పిచ్చికుదిరినగాని పెండ్లిగాదు, పెండ్లియైనగాని పిచ్చికుదురద"ను రీతినున్నది. గాని వాస్తవమునకు ఈ పద్ధతి మారడానికి మాతృభాషలయందు పాఠ్య గ్రంథములు వెలువడేదాని కొక్కే ఉపాయమున్నది. ఏమన విశ్వవిద్యాలయముల యధికారులు ఫలానా తేదీనుంచి అన్ని విషయములు మాతృభాషలలోనే బోధింపబడునని స్పష్టంగా ప్రకటించాలి. ఆయవధి ప్రకటనతేదీనాటికి కనీసము రెండు సంవత్సరములు పాఠములు ప్రారంభించుట కుండవలెను. ఆలోపల యూనివర్సిటీలకు - వారి పాఠ్య క్రమము ననుసరించి- పాఠ్య గ్రంథములను మాతృభాషలలో తయారుచేయ లేకపోయినయెడల ఆ బాధ్యత - ఆ తప్పును మేము - పండితులము - వహించడానికి సిద్ధముగానున్నాము."

అసలు స్థితి యిది. విశ్వవిద్యాలయములు మాతృభాషలలో పాఠములు చెప్పడానికి సిద్ధముగా లేనపుడు - పట్టాభిగారు చెప్పినట్లు - 5 లక్షలు పెట్టుబడితో ప్రచురణ సంస్థ ఆరంభమైనా నాత్రమేమి చేయగలరు? ప్రచురణల నన్నిటిని ప్రజలలో ఉచితముగా పంచునా? లేక గిడ్డంగిలో భద్రము చేయునా? గనుక ఇప్పుడు చేయవలసిన దేమి?

ముఖ్యమైనపని కేవలముగా ప్రచురణ సంస్థ స్థాపించుట గాదు. విశ్వవిద్యాలయములను ఒప్పించి మాతృభాషలయందు ఇదిగో ఫలానా తారీఖునుండి పాఠములు చెపుతారు? అని ప్రకటింపజేయవలెను. ఉదాహరణకు, మన ఆంధ్ర విశ్వవిద్యాలయమున ఈ తూరి తగినంత సంఖ్యలో కాంగ్రెసువాదులు సెనేటు మెంబర్లయినారు. వారు ప్రయత్నించి ఈలాట్టి ప్రకటన నెందుకు చేయించలేరు? బెజవాడ గోపాలరెడ్డిగారికి విశ్వవిద్యాలయమందున్న పలుకుబడినందు లేదెందుకు. వారేల ఈ పనికి పూనుకొనరు? ఆ ప్రకటన వెలువడిన తరువాత సరియైన వ్యవధిలో మాతృభాషయందు తగినన్ని గ్రంథములు రాకుంటే ఆ దోషమంతయూ ప్రకాశకులపైనా, గ్రంథకర్తలపైన పెట్టవచ్చును.

ఇక సామాన్యగ్రంథముల సంగతి. విద్యాలయముల విద్యయంతా మాతృభాషలోనే గనుక వారికి మాతృభాషావ్యసనం పట్టుకుంటే ఆనాటివిషయాల్లో వారి యవసరములకు తగినట్లు ఉద్గ్రంథములు తెలుగులో వేలకువేలు అప్పుడే బయలుదేరును. దానికోసం యిప్పటి ప్రకాశకులనుగాదని వేరొక క్రొత్త కంపెనీ స్థాపించాలిసిన అవసరమేమీ లేదు. యిపుడున్న ప్రకాశకులు అవకాశంకోసం, కొనుగోలుదార్ల కోసం ఎదురుచూస్తున్నారు గాని పెట్టుబడి పెట్టలేక, తగిన సాహసం, అభిమానం లేక వెనుదీయడంలేదు. ఉదాహరణకు, మన కాంగ్రెసు సెనేటర్లంతా పట్టుబట్టి 1948 జూన్ నుండి ఆంధ్ర విశ్వవిద్యాలయమందలి విద్యయంతేయు తెలుగులో జరుగునని ఏల ప్రకటింపజేయరు? అది జేసినంత కాలం మన ఆశలు పత్రికాప్రకటనలవరకే పరిమితమై యుండునని మనవి చేయుచున్నాను.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras.

మధ్య కూర్చున్నవారు ప్రమోదకుమార చటర్జీ, కుడిప్రక్కన కోలవెన్ను రామ కోటేశ్వరరావు.

## కాంగ్రెసు సభలో కమ్యూనిస్టుల గలభా

### శంకరరావు దేవు ప్రకటన

బొంబాయి, ఆగస్టు 31: ఈరోజు సాయంత్రము శంకరరావుదేవు ఉపన్యాసము చేస్తున్న సమయములో సభలో గల్లంతులయి సుమారు యాభైమందికి పయిగా దెబ్బలు తగిలినవి. సభకు కమ్యూనిస్టులు చాలామంది వచ్చినారు.

ఈనాటి యుద్ధములో సోవియెట్ రష్యావారు అవలంబించిన పద్ధతినిగురించి శంకరరావుదేవు ఉపన్యాసము ఆరంభము చేయగానే సభికులలో కొంతమంది అల్లరి చేయడానికి మొదలుపెట్టినారు. స్టాలిన్ వచ్చి ఇండియా స్వాతంత్ర్యానికి పాటుపడతాడనుకొనే వారిని విమర్శించినాడు. అంతటితో పెద్ద గలభా సభలో బయలుదేరింది. కాంగ్రెసు వాలంటీర్లు ప్రమేయము కలుగ చేసుకొన్నారు. కాని ఈలోపల నే లాఠీలతోనూ రాళ్లతోనూ కొట్లాట బయలు దేరింది. ఇంతలో పోలీసువారు జోక్యముకల్పించుకొనిసభనుఆపి వేసినారు. నల్గురిని అరెస్టుచేసినారు. దెబ్బలు తిన్నవారిలో పదిమందిమంచి కాంగ్రెసు వాదులు. వీరిలో ముగ్గురిని ఆస్పత్రిలో జేర్పించినారు. దెబ్బలు తిన్నవారిలో తొమ్మిదిమంది కమ్యూనిస్టులని తెలుస్తున్నది. ఇద్దరికి తీవ్రమయిన దెబ్బలు తగిలినవి.

ఈ సభ విషయమై శంకరరావు దేవు చేసిన ప్రకటనము:—

"కమ్యూనిస్టులు సభలో రాళ్లువేయుటను. లాఠీలతో కొట్టడము మొదలుపెట్టినారు. దానితో సభలో గలభా ఆరంభమయింది. పోలీసులువచ్చి సభను చెదరగొట్టినారు. ఇటువంటి సభలలో ఒక కొంతమంది అల్లరికి తలపడినప్పుడు తక్కిన వారు ప్రశాంతముగా కూర్చుంటేట్లయితే యింతదూరము రాదు. ఇట్లాసభలు భగ్నము అయిపోయినందువల్ల కాంగ్రెసకు నష్టము ఏమిన్ని లేదు. పయిపెచ్చు అది బలవత్తరము అవుతుంది.

## వంగరాష్ట్రంలో నెహ్రూసంచారం?

న్యూఢిల్లీ, ఆగస్టు 31: అఖిలభారత హిందూమహాసభ కార్యదర్శి మనోరంజన్ చౌదరిగారు నిన్న పండిట్ నెహ్రూను కలుసుకొని క్షామానికి పూర్వం, అనంతరం వంగరాష్ట్రపరిస్థితిని గురించి తెలియజేశారు. త్వరలో వంగరాష్ట్ర పర్యటనం సాగించాలని తమకు ఉద్దేశం వున్నట్లు నెహ్రూ తెలియజేశారు.

## భారతసమస్య నిజస్థితి

వాషింగ్టన్, ఆగస్టు 31: భారతదేశ ఆర్థికస్థితిని గురించి, రాజకీయాలనుగురించీ అమెరికన్లకు యథార్థ విషయాలు తెలిపేందుకుగాను 'భారత స్వాతంత్ర్య సంఘం' 70 పేజీల పుస్తకం ఒకటి తయారుచేస్తున్నది. 'భారతదేశం-యథార్థ విషయాల సంగ్రహం' అని ఆ పుస్తకానికి పేరుపెట్టారు.

భారతదేశానికి డాలర్ పరపతి ఉండేటట్లు చేయడానికి అమెరికా నీతిసంగా సహాయపడగలదని ఈ పుస్తకంలో ఎక్కువగా వివరిస్తారట.

బొంబాయి ప్రణాళిక అమలులోకివస్తే ఆ 15 ఏళ్ళలో భారతదేశం అమెరికాతో 450 కోట్ల డాలర్ల వ్యాపారం చేస్తుందని వారు అంచనా వేశారట.

ఈ పుస్తకంలో పెరల్ బక్ వ్యాసం ఒకటి ఉంటుందట. భారతదేశానికిప్పుడు స్వాతంత్ర్యం ఇస్తే అంతఃకలహాలు సంభవించి రక్తం కాలువలు కడుతుందని అంటున్నారని, కాని భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వకపోతే ఎప్పుడో ఒకప్పుడు అంతకుమించిన రక్తపాతం జరక్కతప్పదని, అది ఒక్క భారతదేశంలోనే కాదని, మిత్రరాజ్యాల స్వార్థం దృష్ట్యా చూసినా భారతదేశం స్వతంత్రం అవడం అగత్యం అనీ ఆమె ఆవ్యాసంలో వ్రాసిందట.

## శ్రీ ప్రమోద కుమార చటర్జీ రాక

బెజవాడ, ఆగస్టు 29: శ్రీ ప్రమోద కుమార చటర్జీగారు గత రాత్రి కలకత్తా నుంచి వచ్చినపుడు స్వాగతానంతరం హిందుస్థాన్ కో ఆపరేటివ్ సొసైటీ ఇన్ష్యూరెన్సు శాఖ మేనేజరు రాయుగారింట్లో దిగారు. ఈ మధ్యాహ్నం మాచర్ల వెళ్లారు. 4వ అక్కడ ప్రారంభమయే నాగార్జున శిల్పశాలకి ప్రధానాచార్యత్వం వహిస్తారు.

## "నేనే ముస్లిమునైతే"

## "పాకిస్తాను సంపాదించే వాడిని"

### రాజగోపాలాచారి ఉపన్యాసం

మధుర, సెప్టెంబరు 1: అమెరికన్ కాలేజి యూనియనులో నేడు మధ్యాహ్నము సి. రాజగోపాలాచారిగారుపన్యసించుచు, యుద్ధానంతర సమస్యలు చాల చిక్కయినవి కనుక బ్రిటిషు అధికారులే వాటిని పరిష్కరించి నిర్వహించుకోవలసిందని సామాన్యులు విడచిపెట్టియుండురు, కాని దేశాభిమానులట్లు చేయలేరనిరి.

"ఆగస్టు అల్లరులు ముగిసిపోయి వాటిని ప్రోత్సహించినవారుకూడ యిప్పుడు ఎన్నికలగూర్చి తాపత్రయపడుచుండగా, యింకను కొందరు నాయకులు ఆగస్టు అల్లరులగూర్చి ప్రసంగించుచు, అప్పట్లో ప్రభుత్వాన్ని కాంగ్రెసుని విభజించిన విధానాలగూర్చి జ్ఞాపకంచేయుచున్నారు. అట్లే మరికొందరు పాకిస్తానుగూర్చి తగవులాడుకొనుచున్నారు. ఒకప్పుడు పాకిస్తాన్ను జిన్నాగారికి యిస్తానని నేనంటిని. కాని జిన్నాగారు నిరాకరించినారు, యింకను అందు కంగీకరించాలని నా సహచరులతో నేను పోట్లాడుట సబబుకాదు. అమలులో లేని విషయం గూర్చి మాట్లాడుటలో అర్థంలేదు. నేనే ఆ విషయం విడచినపుడు యితరులెందుకు దానిగూర్చి వాదించుకోవాలి?

"నేనే ముస్లిము నాయకుడనైతే పాకిస్తాను సంపాదించేవాడిని కాని దురదృష్టవశాత్తు నేను ముస్లిము నాయకుడను కాను. దాన్ని సంపాదించగల్గినవారు విషయం సరిగ అర్థం చేసుకోలేదు. అయినా యిప్పటికి, సహేతుకంగా వాదించి సంపాదించుకోవచ్చు.

"సహేతుకవాద మేమనగా:—మన రాజ్యాంగ విధానం ఎట్లు నిర్ణయించుకుంటాం. మన దేశాభిమానం యావద్భారతానికి వర్తించేదేనా? కొందరు తమస్వంత సంఘంపైనే యావద్భారతంకన్న ఎక్కువ అభిమానం కలిగియున్నారని వారి ప్రకటనవల్లనే రుజువగుచున్నది. మనం అట్లాంటి బ్రతుకు బ్రతుకుచున్నాం, కనుక సహజమే. కొందరు కొన్నిసందర్భాలలో మాత్రం స్వార్థరహితంగా నుండగల్గి దేశాభిమానం చూపినచో ఆనవంత దేశాభిమానమేనా మనం సద్వినియోగం చేయాలి. అలా చేయకుంటే మనం విధితప్పిన వారమగుదుము. ప్రతివారిలోనుండు కొద్ది దేశాభిమానాన్నైనా మనం ఉపయోగించుకోవాలి. దాన్ని వృథాచేయుట తప్పు. అట్టి ప్రత్యేకవర్గాలను కూడదీసి భారతదేశ ఐక్యత చేకూర్చాలి. ముదరాసు ఐక్యభారత దేశంలో కలియునా కలియదా అని అడిగే రోజులు రాకపోవు. అట్లా ప్రతిరాష్ట్రాన్ని అడుగవచ్చు. అట్లా ప్రాంతీయ విభజనలుచేసి అవివాటి రాజ్యాంగ విధానాలు నిర్ణయించుకొనేటట్లు విడచిపెట్టాలి. భారత యూనియనులో చేరినవి చేరతాయి లేనివిలేదు. సందేహంగానున్న ప్రాంతాలు తరువాత ఆలోచించుకొని చేరతాయి. చివరకు ఆత్మ ప్రేమను (మహ్మదీయుల) నిర్ణయం వుండనేవుంది.' అని రాజగోపాలాచారిగారు తెలిపిరి. విద్యార్థిసంఘాలు అనేకం బయలుదేరినా ఒకటి కొకటి తోడుగా నుండాలిగాని పోట్లాడుకోరాదని సలహాచేసిరి.

## బ్రిటిషు మధ్యవర్తిత్వం భారత సమస్య:

### ఎన్. ఎం. జోషి సూచన

న్యూఢిల్లీ, ఆగస్టు 31: భారతసమస్యా పరిష్కారంలో బ్రిటిషువారు మధ్యవర్తులుగా ఉండాలనీ, అందరికీ సబబుగా ఉంటాయని తమకుతోచే నిర్ణయాలను చేయాలనీ భారత శాసన సభాసభ్యుడు ఎన్. ఎం. జోషీ ఇండియా కార్యదర్శి లార్డ్ పెథిక్ లారెన్సుకు తెలియచేశాడు. లార్డ్ వేవెల్‌కూ బ్రిటిష్ ప్రభుత్వానికీ సంప్రతింపులు జరుగుతున్న సందర్భాన్ని పురస్కరించుకొని ఈ దిగువ కోరికలు కూడా ఆయన తెలియచేశాడు:

(1) ఇకముందు భారతరాజకీయ సమస్యపై భారతప్రతినిధులకూ బ్రిటిషుప్రభుత్వప్రతినిధులకూ జరిగే సంప్రతింపులలో భారత కార్మికులకు తగిన ప్రాతినిధ్యం ఉండాలి.

(2) కొత్తరాజ్యాంగ నిర్మాణమూ తాత్కాలిక ప్రభుత్వ ఏర్పాటూ భారత కార్మికవర్గం మొదలైన ఓటులేనివారి అభిప్రాయాలకు అనుగుణంగా జరిగేందుకుగాను, ఈసారి ఎన్నికలు వయోజన ఓటింగు ఆధారంగా జరగాలి: అందునిమిత్తం ఓటర్ల జాబితాలను పూర్తిగా సవరించాలి.

(3) భారతదేశానికి స్వాతంత్ర్యం ఇచ్చేందుకు దేశంలో వివిధపార్టీలమధ్య సామరస్యం లేదన్న దాన్ని ఇక సాకుగా పేర్కొనరాదు. ప్రస్తుత పరిస్థితులలో పూర్తిసామరస్యం ఏర్పడడం అసాధ్యం కనుక అభిప్రాయభేదాలు ఉన్నప్పుడు బ్రిటిషు ప్రభుత్వం మధ్యవర్తిగా ఉండి అందరికీ సబబుగా ఉంటాయని తమకు తోచే నిర్ణయాలు చేయాలి.

## అల్లా బక్ష్ హత్య: హర్ నాయకుని అరెస్టు

కరాచీ, సెప్టెంబరు 2: అల్లాబక్ష్ హత్యకు కారణభూతుడని ఆరోపితమైన హర్ నాయకుడు మొహబాబ్‌ను మార్వార్ సంస్థాన సమీపంలో అరెస్టుచేసినట్లు తెలుస్తున్నది. త్వరలో ఇతడిని సింధురాష్ట్రానికి తెస్తారు.

## వేవెల్ - లారెన్సుమంతనం మరో వారం జరగవచ్చు

లండన్, సెప్టెంబర్ 1: గడచిన కొలది రోజులలో లార్డు వేవెల్, లార్డు పెథిక్ లారెన్సు భారతదేశ ఆర్థిక, రాజకీయ పరిస్థితి విషయమై చర్చలు సాగిస్తూ వచ్చారని 'టైమ్స్' పార్లమెంటరీ విలేఖరి ఇవ్వాళ వ్రాశాడు.

భారతదేశ విషయాలలో శ్రద్ధతీసుకొంటున్న ఒక మంత్రిని కూడా వేవెల్ కలుసుకున్నాడనీ, ఇటీవలి పరిస్థితులను గురించీ, 11 రాష్ట్రాల గవర్నర్లతో ఈ మధ్య తాను జరిపిన సంభాషణలను గురించీ ఆయనకు తెలిపాడనీ, ప్రభుత్వ సభ్యులతో వేవెలు సంప్రతింపులు మరో వారం జరుగవచ్చునీ ఆవిలేఖరి వ్రాశాడు.